ఇన్నిటి నెఱింగి ఈశ్వరుండిట్లు సేయ
వగవ నేల? నానందింపఁ దగును గాని

బట్లు—ఒక (చీరతో ప్రవేశము)
ప్రిభా—నాయనా! నీయజమాని నావిన్నపమును మన్నించెనా?
బట్లు—మన్నించెను. నీవు ధరింప నీ చేలమునుగూడా పంపెను. దీనిని మేనదాల్చి దానిని నాకిమ్ము. (ఇచ్చును)
ప్రిభా—(గైకొని కన్నులకద్దుకొని) నాయనా! ఇప్పటియవస్థ కీచేలమే నాకు మిక్కిలి యర్హమైనది. భగవంతుఁడే దీనిని నీమూలమున నాకు దయచేసినాఁడు. నీకు చిరాయుష్యవు గల్గుగాక!
(చీరెను కొని చాటున కేగును)
(తెరవ్రాలును)

రంగము 2

స్థలము;—గంగారాంసేట్ గృహము
(గంగారాముఁడు రక్షరేకులు గట్టుకొని కుర్చీమీద పండుకొని)
గంగా—దర్వాన్!
జయ—హాజర్ మహారాజ్?
గంగా—ఈదయ్యాలభయముచేత నాకునిద్దరలోకూడ దయ్యాలే కనబడుచున్నాయి. కొంచెం మనస్సు శాంతంగా ఉండడంకోసం రామాయణం చదువుతావా?
జయ—జీ సేట్ మహారాజ్! హుకుంకా మాఫిక్ (రామాయణము తెచ్చి చదువును.

ద్విపద

హనుమంతుఁడావేళ అంబుధిదాటి
ఘన మైసలంకలో కాలుమోపఁగనె
రాక్షసుల్ భీకరారవములఁగోడ
భక్షింతు మని వాని పైఁబడరాగ
భూతముల్ దయ్యముల్ బొబ్బల నిడుచు
కొర్రితిపైడికొసి గొంతుక పిసుక—

గంగా—హే! ఉండుండు. అట్టే చదవకు.
జయ—క్యాహై మహారాజ్?
గంగా—కుచ్ నహీ మహారాజ్! అరే బాప్రే! బాప్! రామాయణం
విందామన్నా రాక్షసులూ దయ్యాలేనా!
జయ—రామాయణస్మే సాబ్ అయినా హైనా సేట్ సాబ్!
గంగా—ఏదైనా శృంగారమున్న భాగం చదవవోయి!
జయ—ఇస్మే కహాంమింలేగా సింగారం?
గంగా—ఆయిసాహైతో రామాయణ్ చోడ్ దేవ్. మహాభారత్ పఢో
జయ—జీ! (మహాభారతము తెచ్చి చదువును)

ద్విపద

అపుడు కీచకుండు మోహావేశమంది
అపురూపసుందరియైన సైరంధ్రి
మొగమునుఁజూచి సమ్మోహితుండయ్యె
విగతధైర్యుడయ్యె విశిఖాహతుల
అతఁడు సైరంధ్రితో నతిప్రేమ మీఱ
కుతుకాన రమ్మనంచుఁ గోరికఁ దెలిపి
కోడించి యాకాంత కొరకొరలాడి
పాపాత్ముఁడా! కానిపని యంచుబలికె

గంగా—వాఁ! దర్వాన్! వాఁ మజా హై! బహుత్ మజాహై
అచ్ఛా పఢో పఢో—అవుర్ భీ పఢో
జయ—సేట్ మహారాజ్! కోయీ ఆతా మాలుంహోతాహై!
గంగా—కౌన్ హై! దేఖో? దేఖో!
(ముసుఁగు వేసికొని నాందీబాయి ప్రవేశించును)
(గంగారాముని భయపెట్టి నిష్క్రమించును)
గంగా—(అదిరిపడి) అరే దర్వాన్! సైతాన్ హై! సైతాన్
జయ—అరే భగవాన్! సైతాన్ హై? సైతాన్!
(రాధాబాయి ప్రవేశించును)
రాధా—బాబా! బాబా! సైతాన్ హై ఆతా జాతా ఆతా!

గంగా—అరే! దర్వాన్!

జయ—అరే భగవాః

గంగా—కైసాహై ధర్వాన్!

జయ—కైసాహై రే! భగవాన్!

రాధా—ఆతా బాబా! ఆతా సైతాః!...

గంగా—దర్వాన్!

జయ—సేట్! మహారాజ్? అభీ యేక్ రస్తా హామ్కూ మాలుం హూతాహై.

గంగా—బోలో దర్వాః! జల్దీ బోలో.

జయ—ఆప్కేలియే ఏక్ తెలంగీహాకీమ్కు మైలాయాహుం ఓహాక్కేం ఆప్కూ దేఖేనేసే మై సమస్తాహుం కీసైతాన్ జరూర్ చల్ జాయేగా.

గంగా—అచ్ఛా! దర్వాన్ ఓహాకీమ్కూ ముజ్కూ మిలాఖత్ కరో!

జయ—జీ.

(ఇరువురు నిష్క్రమింతురు)

—~~—

# రంగస్థాన్ రౌడి
## అను పతిభక్తి

## షష్ఠాంకము

### రంగము — 1

స్థలము:—గిరికుమారి మందిరం

(గిరికుమారి సంగీతగోష్ఠియం దుండగా విశృంఖలాకారముతో ప్రభావతి ప్రవేశించును)

ప్రభా—అమ్మా! దాహము దాహము!! (క్రిందపడిపోవును)

గిరి—(దగ్గరకువచ్చి చూచి) అయ్యో! యెవ్వతెయో మిగుల నలసి వచ్చినది. దాసీ! దాసీ! శుభ్రమైన శీతలోదకము గొని రావే!

దాసి—(నిష్క్రమించును)

గిరి—(ప్రభావతిశిరోజములు సరిజేయును) ఆహా! విధాత యెంత నిర్దయుఁడు! ఎట్టి సౌందర్యవతి కెట్టి దురవస్థ గలిగించెను. ఆహార పానీయములు లేక, మొగము కళఁబాసియున్నను సహజమైన సౌందర్యవిలాస మెట్టివారలనైనను సమ్మోహింపఁజేయునదిగా నున్నదే! భళీ! గిరికుమారి అదృష్టము! నాయింటనున్న తొత్తులలో నొక్కతెయు నీమె కాలిగోటికైన సమానమగునది కానరాదు కదా! ఈ జగదేక సుందరిని భగవంతుడు నాపై ననుగ్రహముననే పంపియుండెనేగాఁబోలును! 'ప్రాఁతరోత, క్రొత్త వింత' యనునట్లు నావద్దనున్న పాఁతతొత్తులవలన రాబడి క్రమముగ సన్నగిలుచున్నది. దైవికముగా నాయింటజేరిన యీ క్రొత్తబొమ్మను తెరపై కెక్కించి మరల కొన్ని నాళ్లు శృంగార నాటకమాడి రసికుల నాకర్షింపఁగలను. నాయంతఁజేరిన యీ కాంత యెందుఁ బోగలదు!

ప్రభా—(మూర్ఛలో) హాహాము, దాహాము.

గిరి—దాసీ! దాసీ! ఎంత సేపు జాగు సేసెదవే! ప్రాణములు పోయినపిదపం దెచ్చెదవా యేమి?

(దాసి షరబతుగ్లాసుతో ప్రవేశం)

దాసి—లేదమ్మా! బడలికనందియున్న ఈమెకు వట్టి మంచినీరు తేనేల నని షరబతుకలపి తెచ్చినందున జాగైనది.

గిరి—(షరబతును ప్రభావతిచే త్రాగించును) అమ్మా! కన్నులు తెరువుము కొంచెము బడలిక తీరినదా?

ప్రభా—తల్లీ! నమస్కారము! వెడలిపోవనున్న ప్రాణములను నిలిపి పుణ్యముం గట్టుకొంటివి. ఇట్టి నీకొక నమస్కారమున కన్న నే నేమి చేయగలను?

గిరి—అమ్మా! నీవు క్షేమముగ నుండుటయే పదివేలు. ఈ దాసితో లోనికరిగి శుభ్రజలంబుల స్నానమొనరించి, చెమ్మటం దడిసిన ఈ వస్త్రములను విసర్జించి, నూతనవస్త్రములను ధరించి హితమగునంత భుజించి రమ్మ నా సంరక్షణమున నున్నంతవఱకు నీకే భయమును గలుగదు.

ప్రభా—అమ్మా ఈ యభాగినికొఱకై నీవేల శ్రమనొందెదవు? నా కీ ప్రాణములపై నభిలాష యెంతమాత్రమును లేదు. ఈ స్థితి యందున్న నాకు మరణమే శరణము,

గిరి—అమ్మా! నీ పలుకులవలన నీవు మిక్కిలిదుఃఖజీవివని యర్థమగుచున్నది. ఐనను మరణము కోరుకొనిన యప్పుడెల్ల వచ్చునా? శరీరమున్నన్ని నాళ్ళును దీనిని పోషించవలసిన బాధ్యత తప్పదు గదా? విచారమందక నామనవి విని యీదాసితో లోనికరుగుము. దుఃఖశాంతి గావించుకొనుము. చూచెదవేమే ఈమెను మెల్లగా లోనికిం గొనిపొమ్మ.

దాసి—అమ్మా...! లోనికి రమ్మ?

ప్రభా—ఆహా! దిక్కులేనివారి కీశ్వరుం డెప్పటికెప్పుడేదోయొక యాశామృతముం బోయుచునే యుండునుగదా?

(నిష్క్రమించును)

గిరి—భళి భళి! కాకినాడలో నాకు పూర్వపరిచితుఁడగు ధనశాలి గంగా రాంసేట్ నేడిక్కడికి వచ్చెదనని లేఖ వ్రాయుటకును ఈ కొత్త పిట్ట నా చేజిక్కుటకును సరిపోయినది. అనుకూల సమయమనిన నిట్టుగదా కలిసిరావలయు! రైలువచ్చి చాల తడవైనది. సేటుగా రింకను రాకుండుట కేమికారణమో గదా?

(దాసి ప్రవేశము)

దాసి—అమ్మా! కాకినాడ కాపురస్థుడట మారువాడీలట!

గిరి—ఆ! గంగారాంసేట్ గారు వచ్చినారా!

దాసి—ఔనమ్మా! వారే వచ్చియున్నారు.

గిరి—సరి! నేనును వారికొఱకే వేచియున్నాను. నేను వారి కెదురేగి తీసికొని వచ్చెదను. ఈ లోపలనీవు గదియంతయు నలంకరించి పరిశుభ్రముగా నుంచుము. (నిష్క్రమించును)

దాసి—(గదిని అలంకరించుచుండును)

(గిరికుమారి, గంగారాంసేట్ ప్రవేశము)

గంగా—(గదియంతయు కలయజూచి) గిరికుమారీ! మీ వృత్తికెచ్చట నున్నను 'నిత్యకళ్యాణము పచ్చతోరణమే' గదా?

గిరి—ఏమున్నది బాబూ! కాకినాడలో నున్నప్పటిఖాతా బేరాలన్నీ చల్లబడ్డతరువాత, విజయనగరం చేరుకున్నందువల్లనే కాస్తపీలు గా బ్రతుకుచున్నాను. నాటికి నేడేకదా! తమరికి దాసురాలి మీద కరుణగలిగినది!

గంగా—గిరికుమారీ! నా దయయెంత! నేనెంతగాని, ఈ మందిరము ఈ దర్జాచూస్తే కాకినాడలోకన్నా కావలసినన్ని రెట్లు సౌఖ్యంగా ఉన్నావని తోస్తుంది.

గిరి—ఇదంతా మీ చలవే, సేట్ గారూ! నిలువబడేవున్నారు కాస్త వినోదంగా మాపిల్ల నృత్యం చేస్తుంది, కాలం గడుపుతూ ఉండండి. ఈలోగా మీరెప్పుడూ చూడని అప్సరసను తెచ్చి అమురుస్తాను. పిల్లా! సేటుగారిముందర కాస్సేపు నృత్యంచెయ్యి (నిష్క్రమించును)

(నృత్యాంగన నృత్యం చేయుచుండును—సేటు ఆనందించుచుండును)

గిరి—(అలంకృతయైన ప్రభావతితో ప్రవేశము) (సేటుగారితో రహస్యముగ) సేట్ మహారాజ్! ఇది కొంచెం కొత్తగిత్త మాలిమి అగువఱకు మచ్చిక పరచుకొని శ్రమపడవలెనేమో! అలవాటు పడినదా అనుభవమునకు లోటులేదు. ఐనా రసజ్ఞులైన మీకు చెప్పవలసిన దేమున్నది?

గంగా—(రహస్యముగ) మీ రందరు తప్పుకోండి. నా తంటాలేమో నేను పడతాను.

ప్రభా—(స్వగతము) ఆహా దైవమా! మరల నన్నెన్ని కష్టముల పాలొనరింప సంకల్పించితివి! ఇదియొక వేశ్యాగృహముకలె తోఁచుచున్నది. స్వార్థపరురాలగు నీ జారిణి నన్ను రక్షించు నెపమున లంజరికము చేయింప సంసిద్ధురాలైనది.

ఉ. ఆకటఁ జావనున్న నగు నాగతి నంతము నందనీక పా
పాకరమైన జారిణిగృహంబునఁ జేరిచి లోకులెల్లరుం
గాకులవోలె నవ్వనగు కట్టడి లంజరికంబు సల్పగా
నాకువిధించినాఁడవె ఘనంబగు పాపఫలంబుగా? విధీ!

ఇంక నా కెవ్వరురక్షకులు? ఎవ్వరు నా మొరాలించువారు? ఎవ్వరు నన్ను పాలించువారు? ఓ జగత్పతీ! నీవు దప్ప నాకు శరణ్యమిం కెవ్వరుం గానరారు.

గిరి— ప్రభావతీ! ఏమి యాలోచించుచున్నావు?

ప్రభా—అమ్మా! ఆలోచనకేమున్నది! శోకటిపోటునుండి రక్షించిన తలను గానుగలో నిఱికించిన నీ కరుణాస్వభావమునకై విచారించుచున్నాను.

గిరి—ఈ వేదాంతవిచారణ కేమిగాని, చూడు అతఁడు చాలాధవశాలి రసికుఁడు, నీతో నేమో సంభాషింపఁ గోరుచున్నాఁడు. మా కందఱ కావల పనియున్నది. పోయెదము. నీ వాతని నానందపరవుము.

ప్రభా—అమ్మా! మంచిది. నాగతి యెట్లున్న నట్లగును మీకు ఖని యున్న పోవచ్చును.

గిరి—(గంగారాంతో రహస్యముగా) కొంచెము మెత్తపడుచున్నది. ఇప్పుడే యూదరఁగొట్టిన నుపయోగింపవచ్చును. నాకు సెలవిండు (మిగతావారితో నిష్క్రమించును)

గంగా—(ప్రభావతిని సమీపించి) ఓ సుందరీ! నేను కాకినాడపట్టణములో పేరుమోగిన మారువాడీని. నన్ను గంగారాంసేట్ బహద్దర్ అంటారు. బహుశా నాపేరూ, ప్రతిష్ఠా వినే వుంటావు. నావల్ల అనేకమంది వేశ్యలు బాగుపడి బంగారు మేడలు కట్టారు. ఇదిగో? విన్నావూ? నాపుట్టుక పూర్వోత్తర, నా రసికతా, నా మంచీ, నాచెడ్డా అంతా—గిరిగారికి తెలుసును. అందుచేతఅవిడే నీకు నా విషయములో చాలాదూరం చెప్పేసి ఉంటుందనినన్నునే నాట్టె పొగుడుకోవడం లేదు. విన్నావూ! అదిగో – కళ్లు చిట్లిస్తున్నావు. పోనీ నా విషయమిదివరకే విన్నావుకాబోలును అందుచేత అట్టె చెప్పితే చిరాకుపడుతున్నట్లున్నావు. నా విషయం చెప్పనులే? నీవిషయం చెప్పనా? నీమొగం చూడగానే ఆకాశంనుంచి చంద్రబింబం భూమికి దిగిందేమో అనుకున్నాను. ఐతే చంద్రబింబానికున్న కళంకం, నీ మొగములో కనపడలేదు. అందుచేత ఆవుద్దేశ్యం రద్దుపరచుకున్నాను. విన్నావూ! అదిగో! మళ్ళీ చేపపిల్లల్లాంటి నీకళ్ళు చిట్లిస్తున్నావు. ఓహో! సరే! నీదృష్టి నా వేలివుంగరంమీద పడుతూంది. ఇది వజ్రపుటుంగరం నీవు మొగమాటంచేత అడగలేకున్నావు. నేనే ఇస్తాను. ఇది నాలుగువేలు ఖరీదు చేస్తుంది సుమా! ఇదిగో! ఉంగరం వేలికి పెట్టనా? అదుగో! మొగము చిట్లించావు. పోనీ, నీవే వేలికి పెట్టుకో. (ఉంగర మిచ్చును)

ప్రభా—(స్వగ) ఆహా! ఏమి నాయదృష్టము! పరమేశ్వరుఁడెంత కృపామయుఁడు! మనసార నమ్మినవారి నన్యాయము చేయఁడుగదా! ఈ మూఢుడు నా హృదయమును గ్రహింపలేక, నన్ను ప్రసన్నురాలినిగాఁ జేసికొనదలంచి వజ్రాంగుళీయక మిచ్చినాఁడు. ఈ యుంగుళీయకమునందలి వజ్రమే నా సర్వకష్టములకు శాంతిని ప్రసాదించుఁగాక!

గీ. ఎఱిగి యెఱుఁగక చేసిన దురితములను
సర్వమును క్షమియించి నీ సన్నిధాన
మందు జేర్చుకొనుము దైవమా! త్వదీయ
దాసురాలి కష్టముల నంతంబుచేసి

(ఉంగరము నోట నిడుకొని నములును)

గంగా—(దిగ్భ్రాంతుఁడై) ఆ! ఆ! ప్రభావతీ! ప్రభావతీ! ఎంత దారుణము చేసితివి? ఎంతదారుణము చేసితివి!

ప్రభా—(భూమిపైబడి) సేట్‌జీ? విచారింపకు! మీకిదే నమస్కారము ఈ భూమిపై నాకెవ్వరును గావింపలేని మహోపకారముఁగావించితిరి. నాపాలిటి భగవంతునివలె నేగుదెంచి, నా పాపజీవితము నంతము నందించి పరమేశ్వరసాన్నిధ్యమునకు దారి చూపితిరి. మీకిదే తుదినమస్కారములు. అబ్బా! కన్నులు పచ్చనై ప్రపంచమంతయు గిరగిరఁతిరిగిపోవుచున్నది. సేట్‌జీ! మీకిదే నమస్కారము. నేనిఁక మాటాడజాలను, హా భగవానుడా! (మరణించును)

(దాసిప్రవేశము)

దాసి—హా! హా! ప్రభావతి మరణించినది. ఏమిగతి!

(నిష్క్రమించును)

గంగా—అరరే! నిజముగా నిదిమరణించినది. ఈఖూనీ కేసొకటినాపైఁ బడును గాఁబోలును. ఎవ్వరును చూడకముందే నేను పారిపోవడమే మంచిపని. (పోఁబోవును)

(రెండవవైపునుండి-శంకరరావు తూలుచు ప్రవేశించును)

గంగా—(చూచి) ఏమి ఇది! శంకరరావువలె నున్నాఁడు. ఈ హంతకుఁడు తిరిగితిరిగి తుదకిక్కడకు చేరుకున్నాఁడా! త్రాగియున్నట్లున్నాఁడు. ఇదే సమయము. ఈఖూనీకేసును వీనిమీద త్రోసెదను. (నిష్క్రమించును)

శంక—గిరికుమారీ! గిరికుమారీ! ఏదీ యెక్కడను గనఁబడదే? (ప్రభావతిని జూచి) ఇచ్చటనెవరో పడియున్నారు. మరణింపలేదుగదా!

(దగ్గరకేగి పరికించి) హా! భగవంతుఁడా! ఇది యెవ్వరు! ప్రభావతియా యేమి? పిశాచమువలె నావెంటబడి యిక్కడకు గూడవచ్చినదే! [illegible] చచ్చినట్లు పడియుండ నేల!(కాలితో దన్ని) ప్రభావతీ! ప్రభావతీ! ఏమి పలుకదు. (శ్వాస పరిశీలించి) దైవమా! [illegible] కేమ[illegible]ది. దీని శరీరమున (ప్రాణములు లేవు)

(తెంలో) పకడో పకడో శంకరరావుకూ పకడో–బంద్ కరో!

శంక—(ఉలికిపడి) ఇది నామామయగు తులసీరావు కంఠధ్వని వలె నున్నది. రానిమ్ము. వీని ప్రాణములు నేటితో సరి.

(తుపాకి సవరించుకొనును)

(పురుషాకృతితో నున్న అన్నపూర్ణతో తులసీరావు ప్రవేశము)

తుల—శంకరరావు! నిలువుము. ఇంతకాలమునుండియు నన్ను తప్పించుకొని తిరిగితివి కాని, ఇంక నెందును పారిపోవజాలవు. నేడు నీ పాపగాధ [illegible] నిన్ను సర్కారువారి కప్పగించి నా బాధ్యతను తొలగించుకొందును.

శంక—మామగారూ! మీకునాపై నింత వృధా కార్పణ్య మేటికి?

తుల—నీవు హంతకుఁడవు – చోరుడవు–జారుడవు– నీతిభ్రష్టుడవు మతభ్రష్టుడవు – కులభ్రష్టుడవు నిన్ను శిక్షింపక తప్పదు. ఈశ్వరసమ్మతముగా నీకు శిక్ష కల్గింతును.

శంక—అబ్బా! ఎన్నిభ్రష్టులను నాయందు దారోపించినారు. మామా! ఇన్నివిధముల భ్రష్టుండనయినను అదృష్టభ్రష్టుఁడను మాత్రము కాలేదు సుడీ!

తుల—ఇంతవరకు కాకున్నను నేఁడదికూడ కానున్నదనియెఱుఁగుము.

శంక—కాదు. కాదు. ఎన్నటికిని కాఁజాలఁను. వెఱ్ఱిభ్రాంతియేల పెట్టుకొందురు! శంకరరావుతోడ శత్రుత్వము పాముతో చెరలాటమని యెఱింగి మర్యాదగా నిచ్చటినుండి తొలగి పొండు; మీ క్షేమమునకై చెప్పుచున్నాను.

తుల—కానిచో–నా క్షేమమున కపాయముగల్గునా!

శంక—తప్పక కల్గితీరును.

తుల—ఓరీ! దుష్టుఁడా! కులభ్రష్టుఁడ! చేసిన పాపములకు సిగ్గుపడి తలవంచుకొనక మొండితనము వహించెదవేలా! వృద్ధుఁడైన రంగానాథవృద్ధుఁ చంపితివి. నిర్దోషియగు రమేశబాబును తుపాకితో గాల్చితివి. అసంఖ్యాకులగు పోలీసులను జంపితివి. నేఁడీవేశ్యా గృహముం జొచ్చి యీ కాంత నొకతెను ఖూనీచేసితివి. ఇన్ని ద్రోహములకు నీవే సమాధానము చెప్పఁగలవు?

శం—ఎన్నిద్రోహములైన చేసియుందునుగాని, యీ కాంతను మాత్రము నేను ఖూనీచేయలేదు—లేని అన్యాయమైన వాచదోషమునకు పాలుగాకుము.

తుల—ఏమీ! దీనిని చంపలేదా?

శంక—లేదు.

తుల—ఛీ! అనృతాలాపీ......

శంక—నేనుకాను; అనృతాలాపిని నీవు.

తుల—దుర్మార్గుడా! నీతో వాగ్వివాదమునకిది సమయముకాదు. నాకు సమాధానము చెప్పినట్లుగాదు. న్యాయపీఠముయెదుట చెప్పుకొనుము. (అన్నపూర్ణతో) ఓయీ! చూచెదవేమీ! వీనిని బంధింపుము.

శంక—ఏమీ నన్ను బంధింపఁదలచి వచ్చితివా! వలదు సుమా! ప్రాణాపాయకరము సుమా!

తుల—ఆ ప్రాణాపాయమేమో చూడఁదలచియే వచ్చితిని.

శంక—మామా! నన్ను బంధించుటకన్న వేరుమార్గము లేదా?

తుల—'మామా! అల్లుడు, అను దుష్ప్రసంగము మానివేయుము. మనకట్టి సంబంధములు వదలి చాలాకాలమైనది.

శంక—ఆ నట్టిమాట ఎట్లువదలును? కాలుగడిగి కన్యాదానముచేసి నట్టిసంబంధ మింత శీఘ్రముగా వదలగలదా?

తుల—ఓరీ! నీ నక్క వైచ్యములను మానివేయుము. నీకిదే యంత్య కాలము.

శంక—నాకా? నీకా?

తుల—నాకేల కల్గును?

శంక—ఏలకల్గునా! చెప్పియుండలేదా; శంకరరావుతో శత్రుత్వము ప్రాణాపాయకర మని.

తుల—నీ మొండితనమునకు నవ్వువచ్చుచున్నది. పాపాత్ముడా! నేనింక కాలయాపనమున కోర్వను.

శంక—నేనును ఓర్వలేకున్నాను. ఇంక కాలయాపనమేల! పదిహత్యలతో పాటు పదునొకండవ హత్య చావు దుర్మార్గుడా!

(తుపాకి ప్రేల్చును)

తుల—హా! హా! హంతకుడా! (మరణించును)

అన్న—(తండ్రిపైఁబడి) హా! తండ్రీ! తండ్రీ! మరణించితివా? అల్లునిచేతనే హతమైతివా? ఇంక నాకేది దారి?

శంక—ఓరీ! నీ వెవ్వఁడవు! వీఁడు నీకు తండ్రి యెట్లగును?

అన్న—(చేతులుజోడించి) స్వామి! ఈ దీనురాలు, పురుషాకారమును దాల్చియున్న మీదాసురాలు అన్నపూర్ణ.

శంక—అన్నపూర్ణ! అన్నపూర్ణ! భర్తను బంధించుటకే సాహసించి వచ్చితివా?

అన్న—స్వామి! ఈయభాగ్యురాలు అంతద్రోహము తలపెట్టలేదు. ఎట్లయిన తమదర్శనము చేయింపుమని నేను వేడుకొనగా నా తండ్రి ఈ వేషముతో నన్నిందుఁ గొనివచ్చెను.

(తెరలో) ఖూనీహోగయా! పకడో! శంకరరావుకు?

అన్న—ప్రణేశ్వరా! పోలీసువారు మిమ్ము వెంబడించి వచ్చుచున్నారు. మీరు శీఘ్రముగా పారిపొండు. ఈరెండుహత్యల ఫలితమును మీకు మారుగా నే ననుభవించెదను.

(తెరలో పకడో! పకడో)

శంక—హా! దైవమా! ఎట్టి దుష్కరఘటనముల నెట్లు మార్చి వేయుచున్నావు!

అన్న—తొందరపడకున్న ప్రమాదము రాగలదు స్వామీ! స్వామీ

శంక—(నిస్పృహుఁడై తుపాకిని పారవైచి పరుగెత్తును)

అన్న—(తుపాకిని పట్టుకొని నిలువఁబడును)

(పోలీసు ఇన్‌స్పెక్టరు ఇద్దరు పోలీసుభటులతో ప్రవేశించును)

ఇన్—ఎవరీయింట హత్యచేయుచున్నది?

అన్న—అయ్యా! కనుపడుచుండుట లేదా? నేనే హత్యచేసినాను. ఒకటికాదు. రెండుహత్యలను చేసినాను. నన్నే బంధింపుము.

ఇన్—నీ వెవ్వడవు? శంకరరావు హత్యచేసెనని వింటిమి, అతఁడెక్కడ?

అన్న—నే నెవ్వఁడనో అదిమీకేల? హత్యచేసినదినేను నన్నే బంధింపుడు

ఇన్—శంకరరా వెక్కడ?

అన్న—శంకరరా వెవ్వడో నే నెఱుఁగనే.

ఇన్—అట్లయిన నీవేనా హంతకుఁడవు?

అన్న—ఇదివఱకు రెండుసార్లు మనవిచేసితిని.

ఇన్—భటులారా! వీనిని బంధింపుడు,

భటులు—(అన్నపూర్ణను బంధింతురు)

(తెర వ్రాలును)

రంగము — 2

స్థలము : గంగారాంసేట్ గృహము

(గంగారాం, జయరాం ప్రవేశము)

గంగా—దర్వాన్!

జయ—మహారాజ్!

గంగా—నాకు పెద్ద—నాకు పెద్ద—పెద్ద—పెద్ద - (వణఁకును)

జయ—ఏమిటి? నీకు పెద్ద?

గంగా—ఉండవోయ్, ఉండు. కొంచెము తమాయించుకోనీ! కొంచెం శాంతపడనీ, తొందరపెట్టకూ అబ్బా! చూడు గుండెలు కొట్టుకుంటున్నాయి!

జయ—ఏమిటి? సైతాన్ కాదు గదా?

గంగా—(అదిరిపడి) బాబోయ్! దర్వాన్! (వెఱ్ఱికేక పెట్టును)

జయ—అరే భగవాన్!

గంగా—ఉండు - నాకు - పెద్ద - నాకు - పెద్ద...

జయ—ఆc! ఆc! పెద్ద - పెద్ద - ఏమిటో తమాయించుకొని చెప్పండి. గాభరా పడకండి.

గంగా—నాకు పెద్ద జ్వరం వచ్చిందోయ్ దర్వాన్!

జయ—ఎందుకనీ? మీకిప్పుడు జ్వరం?

గంగా—ఎందుకా! ఎందుకా నువ్వెఱుగవూ? నా కొంపలో సైతాన్ చేరింది. నాలో సైతాన్ చేరింది, నా కూతురులో సైతాన్ చేరింది; ఇంతకు నువ్వు దర్వాన్‌వో సైతాన్‌వో తెలియకుండా వుంది.

జయ—నేను సైతాను ఎందుకవుతానూ? నేను దర్వానునే.

గంగా—ఏమో! ఓ సైతాన్...

జయ—సైతాన్ కాను దర్వాన్

గంగా—దర్వానూ సైతానూ ఒక్కటేరా బాబూ - ఒక్కటే నువ్వు ప్రవేశించాకే నాకొంపలో సైతాను ప్రవేశించింది.

జయ—సరే కాని, మీ జ్వరానికి కారణ మేమి?

గంగా—సైతాన్ భయముచేత విజయనగరం వెళ్ళి సాసకొంపలో సరసా లేడ్చాను. బాబో! అక్కడే! అక్కడే! అక్కడే! జరిగింది—

జయ—ఏమిటీ! ఏమి జరిగిందీ?

గంగా—జరిగింది. (జరిగితే యేమి-నావల్లనే జరిగింది! అయితే శంకర రావుమీద తోసేశాను. పోలీసుకు రిపోర్టిచ్చాను కూడా.

జయ—ఏం జరిగిందయ్యా?

గంగా—అబ్బా! పోనిస్తూ! ఏదో ఒకటి జరిగింది, తలచుకుంటే మళ్ళీ తిరుగుతూంది.

జయ—ఖూనీగాని జరుగలేదు గదా!

గంగా—అరే సైతాన్! అదేనోయ్ - జరిగింది - అదే.

జయ—సైతాన్ అనకండి - దర్వాన్ అనండి.

గంగా—దర్వానే హర్వాన్ హర్వానే సైతాన్.

(పోలీసువేషముతో కృష్ణమూర్తి ప్రవేశము)

కృష్ణ—ఈ యింటియజమాని గంగారాంసేట్ యెక్కడ?

జయ—సేట్ మహారాజ్? పోలీసుభీ ఆగయా! అబ్ క్యాకరేంసక్తే!
గంగా—పోలీస్ క్యా వాస్తే ఆయా? మేరా ఘర్ క్యా!
జయ—ఖూనీ మొఖద్దమా మే. ఆప్కా పకడ్ లేజానే కావాస్తే! మహారాజ్!

గంగా—అరే చూప్ రే చూప్! ఖూనీ కౌన్ కియా హై?
కృష్ణ—నీవేనా? గంగారాంసేట్ అనేవాడవు?
గంగా—ఔను బాబూ! ఔను నేను
కృష్ణ—నీపేర వారంటుంది. నిన్ను ఎరెస్టు చేయడానికి వచ్చాను.
గంగా—బాబో? నాకు వారంటెందుకు? నన్నెందు కెరెస్టు చేస్తారా?
కృష్ణ—విజయనగరంలో గిరికుమారి అనే వేశ్యయింట్లో - ఆడదాన్ని ఖూనీ చేసి ఆనేరం మరొకరు చేసినట్లుగా అప్రమాణసాక్ష్యమిచ్చిన రెండు నేరాలకున్నూ.

జయ—సేట్ మహారాజ్! అంతా పబ్లిక్ అయిపోయింది. నిజమొప్పుకోండి.

గంగా—అరే! నువ్వొకడవు శనిలాగ - నా కెక్కడ దాపరించావురా?
కృష్ణ—ఏమిటీ! ఆలస్యం. చేతులకు బేడీలు వేయవలెనా? తిన్నగా ఠాణాకు నడుస్తావా?

గంగా—అయ్యో బాబో! ఇదెక్కడి గ్రహచారము?
కృష్ణ—కల్లబొల్లి యేడ్పులు కట్టిపెట్టి నడు నడు.
గంగా—నేను, ఖూనీ చేయలేదయ్యా! ఉంగరం తిని అమ్మండే చచ్చింది.
కృష్ణ—ఆసంగతి కోర్టులో చెప్పుకుందువుగాని పద...
గంగా—అయ్యో దర్యాన్!
జయ—అరే దర్యాన్!
గంగా—ఇప్పుడేం చేయమంటావు?
జయ—బాబూ! ఇది ఖూనీకేసు-ఉరిశిక్షో, ద్వీపాంతరవాసమో తప్పదు జమాఖర్చులు అప్పగింతలు పెట్టి చల్లగా దారిచూచుకోండి.
గంగా—శంకరరావు ఆస్తిఅంతా అన్యాయంగా భవాయించేశాను. ఆ పాపంచేతనే సైతాన్ కూడా వెంటపడ్డది.

జయ—అయితే అందుకు విచారమెందుకు మహారాజ్!

గంగా—విచారపడక యేం చెయ్యమంటావ్.

జయ—వెళ్ళినా రెల్లాగా జైలుకు వెళుతూనే వున్నారు. ఈ పాపం కూడా వొకటి మూటగట్టుకొని వెళ్ళడమెందుకూ! శంకరరావు భార్యా, కుమారుడు క్షేమంగానే వున్నారు. కనుక వారి ఆస్తి వారికి రాసిచ్చేయండి. మీ కుటుంబానికి మీ ఆస్తే ఎక్కువ...

గంగా—సరే ఆపాపమొకటి పరిష్కారమైపోయింది. మరి సైతాన్ సంగతి యేమిటి?

జయ—నేను ఒక ఉపాయం చెపుతాను. కోపపడకపోతే.

గంగా—అన్నికోపాలూ అణగిపోయి జెయిల్లోకి సిద్ధంగా వున్నాను. ఆ వుపాయమేదో శీఘ్రంగా చెప్పివేయి...

జయ—మీ రెరుగని వుపాయమేమిటి! సైతాన్ రాసిన వుపాయమే వుపాయం!

గంగా—ఏమిటి? జయరాంగాడికి బిడ్డ నివ్వమంటావా?

జయ—నామనవి అదే! ఏమంటారా? మీరిప్పుడు జెయిలునకు వెళుతారు, మీకు కావలసినంత ధనం. ఆస్తీ వున్నాయి మొన్న మొన్న మీకు పుట్టిన కుఱ్ఱవాడూ—

గంగా—నాకు పుట్టలేదోయ్ నా భార్యకు పుట్టినాడు. నాందీబాయికి పుట్టాడు. అర్థంచేసుకొని మాట్లాడు.

జయ—అదే అదే! మీ భార్యకు పుట్టిన కుఱ్ఱవాడే! చిన్నవాడు — ఆస్తింతా ఆగమైపోతుంది—అందుచేత రాధాబాయిని జయరాం కిచ్చి, పెండ్లిచేస్తే ఆస్తిని సంరక్షిస్తాడు. కుటుంబానికి ఆధార మవుతాడు.

గంగా—వాడు నాకు శత్రువుగదటోయ్ దర్వాన్! శత్రువుడికిబిడ్డనిచ్చి సంసారం, ఆస్తిఅంతా అప్పగించేదా!

జయ—అయితే జెయిల్లోకూడా సైతాన్ తప్పదు.

గంగా—అరే దర్వాన్!

జయ—భగవాన్

గంగా—ఐతే, ఇదే సిసలంటావా?

జయ—తప్పకుండా...

కృష్ణ—ఎంతసేపీ ఆలోచన! జెయిలుకు నడూ:

గంగా—ఉండరా బాబూ! నీకో అంకుమొగుడితద్దినము వచ్చింది! ఆ స్త్రీపా స్త్రీ అప్పగింతలు పెట్టనీ! అయితే దర్వాక! మనకా జయరాం యెక్కడ దొరుకుతాడు మరి?

జయ—అదంతా తమకెందుకూ! కాగితం వ్రాయడంపని తమరుకాని వ్వండి. ఇక్కడున్నట్టుగా జయరామ్‌సింగును యీడ్చుకొచ్చే భారము నాది.

కృష్ణ—జల్దీ, జల్దీ కానివ్వండి ఆట్టేసేపు నేవాగేవాడనుకాను.

గంగా—తాళవోయ్ ఆకుమగడా! తెయితక్క లాడతావేమి? దర్వాక! ఇపుడు నామనస్సెంతమాత్రం స్వాధీనంగా లేదు. పెద్ద గందరగోళంలోపడి కొట్టుకు టున్నాను. ఆ కాగితంకూడా నీవే రాసెయ్యి. సంతకం పెట్టిస్తాను.

జయ—చిత్తం (కాగితం వ్రాసి) చిత్తగిస్తారా!

గంగా—(చదివి) అంతా సరీగా వుంది. అయితే - ముందు విధాన మేమిటో, ఆ జయరాంకూడా ఇప్పుడే వస్తే ఆస్తి అంతా అతనికి ఒప్పగించి, పెళ్ళిచేసేసి పెండలాడే దారి చూచుకుందును. ఇదిగో సంతకం చేస్తున్నాను. (చేయును)

(నాందీబాయి - రాధాబాయి ప్రవేశము)

రాధా—నాన్నా! ఏమిటీ గడబిడ? మనయింటికి పోలీసు లెందుకు వచ్చారు?

నాంది—ముఝే ప్యారా! ఏ గడబిడ్ క్యాహై?

జయ—ప్యారాకూ ప్యారా పకడ్ జాతా హై!

గంగా—ఖూనీకేసులో పోలీసువాళ్ళు జెయిల్లోకి లాక్కుపోతున్నారు. చేసిన పాపాల కన్నిటికీ చెప్పుదెబ్బలు కొట్టుకున్నాను. శంకరరావు ఆస్తి అతనికొడుక్కు రాసిచ్చేశాను. సైతాన్ను వదలించు

కోపడానికి - రాధాబాయిని జయరాముకిచ్చి పెళ్ళిచేస్తాను. ఆ సంగతికూడా కాగితంలో రాయించేసి సంతకం చేశాను.

రాధా—నిజమేనా? బాబా! నిజమేనా?

గంగా—అంతా నిజమే. ఇదిగో సంతకం చేసినకాగితం. దర్వాన్‌దగ్గరే ఉంచి, ఏతే నేను జైలుకు వెళ్ళకముందే జయరామ్‌గాడొస్తే పెళ్ళిచేసేద్దును.

రాధా—బాబా జయరాంసింగును తీసుకొస్తాగాని శత్రువుడని కోప పడవు గదా?

గంగా—శత్రుడుగాడు. అల్లుడు కోపమెందుకమ్మా! సైతాను వొదలి పోతే చాలు ననుకొంటున్నాను.

రాధా—అయితే బాబా! ఇదిగో! దర్వానే జయరాం.

(మీసములు లాగివేయును)

జయ—దర్వానే జయరామైతే, పోలీసే కృష్ణమూర్తి. ఇద్దఱం ఇక్కడే వున్నాం మామగారూ! మీదయ - మా భాగ్యము.

(కృష్ణమూర్తి వేషము తీసివేయును)

గంగా—(తెల్లబోయి) ఆరి దొంగముండా కొడుకుల్లారా! ఇద్దరూచేరి ఇంతపని చేశారా!

కృష్ణ—సేట్‌గారూ! క్షమించాలి. మేము చేసిన పని మీ కెప్పుడూ అపకారం కాదు. మీకు జెయిలూ, అన్యాయమువలన గలిగే పాపమూ - ఈ రెండూ లేకుండా రక్షించాము.

గంగా—అయితే, సైతానింక రాదుగదా?

కృష్ణ—రాదు.

గంగా—అరే! నే ననుకొన్నంతా అయింది. హర్వానే దర్వాన్ దర్వానే సైతాన్.

జయ—దర్వానే సైతాన్ గాదు! దర్వానే జయరాం.

కృష్ణ—అదీ కాదూ! దరవానే దామాద్.

గంగా—సరే. జరగవలసినదంతా జరిగినది. ఇప్పుడు నాకేమి సెలవు!

కృష్ణ—మీరు సంతకం చేసినకాగితం ఏలాగూ చలామణి కావలసినదే! కనుక శంకరరావు కుమారునికి ఆస్తి అప్పగించే భారమునాది. రాధాబాయికి జయరామునకూ ఇప్పుడే పెళ్ళి చేసేద్దాం.

గంగా—సంతోషం. అయితే ఇదే శుభముహూర్తం. కానివ్వండి.

కృష్ణ—(రాధాజయరాముల చేతులు పట్టించును అందఱు దీవింతురు)

పాట

మారాధమ్మ పెండ్లికూతు రాయనే ॥మా॥

జయరాము పెండ్లికొడు కాయనే ॥మా॥

ఆనంద మానంద! మానంద! మానంద॥

మానందమాయే! బ్రహ్మానందమాయే ॥మా॥

(తెరవ్రాలును)

రంగము — 6

స్థలము :—ఒకబయలు

(విచారముతో శంకరరావు ప్రవేశము)

శంక—కటకటా! ఎంతకఠిన కర్ముడను. ఎంతపాపాత్ముడను. ఈఛండాల జన్మనకింక నీధరణిపై తరణోపాయము గలదా! హా! అన్నపూర్ణా! అన్నపూర్ణా ఓమహాసాధ్వీ పవిత్రమై అనిర్వచనీయమై అనుపమానమై, అనన్యదుస్సాధ్యమైన నీ పాతివ్రత్యమే యీ నిర్భాగ్యు నింతకాలము రక్షా కవచమై కాపాడినది. అందులకు ప్రతిఫలముగా నేను నీ కేమొనరించితిని! ఆహా! తలంచుకొనిన గుండెలు బ్రద్దలగుచున్నవి. ప్రాణములు తల్లడిల్లుచున్నవి! పవిత్రమా నీ శిరమును ధూళిధూసరితమౌనట్లు తన్నిన యీ పాపాత్మునిపాదము లింకను విరిగి ముక్కలు గాకున్నవేమి! పరమపావనతరమైన నీనామమును చ్చరించుటకైనను అర్హముగాని యీ పాడునాలుక గర్భనిర్భేదముగ నిన్ను దూషించినందుకులకై యింకను పుసుగులు పడిపోకున్నదేమి. దివ్యతమకాంతిపుంజము

లచే నావంటి కలుషస్వరూపునకు తేరిచూచుటకైనను సాధ్యముకాని శరీరమునుండి రక్తధారలు నేలనొలుక కటారిచే పొడిచిన యీ పాపిహస్తం బింకను పటాపంచలు గాకున్నదేమి! హా! దేవీ! యీఘోరరూప రాక్షసునివలె యీ మనుష్యాకార భూతమువలన ఇహసౌఖ్యము నీవణుమాత్రమైన నెఱుంగకున్నను తాళిగట్టిన మహాపరాధమునకు ధర్మపాశబద్ధవై, నే నవివేకినై త్రాగుబోతునై, కులభ్రష్టుడనై, హంతకుడనై యొనరించిన సర్వాపరాధములను, సమస్త రాజద్రోహములను, నీపైనిడుకొని కంటికి రెప్పవలె, కన్నతల్లివలె నన్ను రక్షించుటయే కర్తవ్యమని భావించితివి. భార్యవగు నిన్ను రక్షించవలసిన ధర్మమును తలక్రిందులుగా గావించి హంతకుఁడనై నిన్ను రాజభటుల కప్పగించి, మొండినై ఇఁక నెవ్వరికొఱకు, ఏసౌఖ్యములకొఱకు ప్రాణముల నీ కలుషాంగమున ధరించియుంటిని! అన్నపూర్ణా! ఈ పాపాత్ముఁ డొనరించిన యసంఖ్యాక దుష్కృత్యములకు కోపించి సంహరింపక నీవేల దాక్షిణ్యముంబూని రక్షించితివి! దుష్టుఁడనైన నాకొఱకు; కన్నతండ్రికి విరోధివైతివి. చిన్నిసుతుని వెంట నిడుకొని నీవంటి సాధ్వీమణులు కాలుమోపఁదగని రంగూన్‌పురమునకువచ్చి నన్ను శోధించి కనుగొంటివి. క్రూరాత్ముఁడనై నిన్ను పరాభవించి వంచించిన నాయందు నుంతైన క్రోధమూనక నీకన్నులయెదుట నీకన్నతండ్రిని చంపుచున్నను యపరాధము సైతము నీపై నిడుకొంటివే! హా! అన్నపూర్ణా! అన్నపూర్ణా! ఈజన్మమున యీ పాపాత్ముఁడు చేయని క్రూరకర్మ యొకటియైన మిగిలియున్నదా! సర్వపాపములను యీ దుష్టునిముఖమున పిశాచములై తాండవించుచున్నవి. ఛీ! పాపము దురితాత్ముని ముఖముచూచిన మహాపాపము

సీ. త్రాగిన పొగరుచే, తండ్రిచావునకయి,
        డెందమ్మున ప్రమోదమందినాను
    నీచ ధనాశా పిశాచదుర్బుద్ధిచే
        సద్బ్రాహ్మణోత్తముఁ జంపినాను

రంగూనులోనన్ను రక్షించినట్టి ర
క్షకుని తుపాకిచే గాల్చినాను
అతని దారాధనం బపహరించియు ఘోర
విధి ననాధను జేసి విడిచినాను
పరమసాధ్వియైన భార్యను రంపానఁ
దరిగినాను కాలదన్నినాను
కడకు మామగారిఁ గడతేర్చి హత్యను
గాంత తలనుబెట్టి గట్టినాను.

హా! హా! దారుణము! దారుణము! మహాదారుణము! భరింప జాల పశ్చాత్తాపమహానలము యీ కలుషశరీరము నాపాదశిరః పర్యంతమును కాల్చివేయుచున్నది! ఓ మహాజనులారా! చూచితిరా! యీ పాపాత్ముని దుశ్చరిత్రమును. ఇట్టి పాపభూయిష్ఠ చరిత్రముగల నరహంతకు నెన్నడైనఁ గాంచియుంటిరా? కథలోనైన వినియుంటిరా? కలలోనైన నూహింపగలరా? కల్ల—కల్ల పూర్వకాలమున జరిగినట్లు కథలుగా చెప్పుకొను పుక్కిటిపురాణములయందలి భయంకర రాక్షసులైన నేను జేసినన్ని దుష్కృత్యములు, నేను చేసినన్ని హత్యలుఁ నేను పలికినన్ని యనృతములు, నేను సల్పినన్ని దారుణకార్యములు కాంచి యుందురా? భగవంతుడైన నీ చండాలుని శిక్షింపఁ దగినన్ని శిక్షలు తన శిక్షాస్మృతియందు లేకుండుటచే నిట్లు వదలినాడు కాబోలును. ఓ పౌరులారా! ఓ జానపదులారా! మిమ్ములందఱను ప్రార్థింతును నా జీవితమున కంతముఁ గలిగించి యీ పరితాపమునుండి విముక్తునిఁ జేయుఁడు. నా జీవితమధ్యమునం దింతవఱకు ఒకరిని ప్రార్థించి యెఱుఁగను. ఒకరిని చంపుటయేగాని, ఒకరిచే చంపఁబడి యెఱుఁగను. గనుక ఇట్టి నేను! ప్రార్థించుచున్నాను. కనికరముచేనైన సరే! కాఠిన్యముచేనైన సరే! నన్ను సంహరింపుడు (తలబాదుకొని) అయ్యయ్యో! ఈ కష్టజీవికి అంతటి భాగ్య మెక్కడిది! కలుషములు తాండవించు ఈ పాపి ముగముం జూడఁజాలక కాబోలును పౌరులందఱును తలలు వంచుకొని సందు సందులంబడి పోవుచున్నారు! హా! హా! మాతృశాప మూరకపోవునా, వేశ్యా సురాపానలోలతచే నొడలు మఱచి కన్నతల్లికి, తోఁబుట్టువునకు

ధర్మపత్నికి ఒక్కకడి యన్నమైనంబెట్టక, కడుపుగాల్చిన పాపమూరక పోవునా! అన్నపూర్ణా! నీ తండ్రిని చంపి, ఆ హత్యాదోషమును నీపైఁ నిడి మొద్దువలె బ్రతికియున్న పాపాత్ముఁడగు శంకరరావు ఇదుగో! నీవైన శపింపుము. నీవు మహాసాధ్వివి. నీ శాపముచే తలపగిలి నేను చత్తునని నమ్మకమున్నది. శపింపుము; శపింపుము. అన్నపూర్ణా! పతియాజ్ఞ మీరరానిదిగదా! శపింపుము; శపింపుము. అయ్యయ్యో' నీవేల నన్ను శపింతువు. ఎన్నిసారులో నన్ను రక్షించుటకై నీ ప్రాణములను సైత మియ్య సిద్ధమైననీవు నన్ను శపింపవు. నేనెఱుంగుదును. అయ్యయ్యో నాకేదిదారి. అన్నపూర్ణా! ఎక్కడనున్నావు! ఆహా! అన్నట్లు మఱచితి నీ వీ పాటికి వధ్యశిలపై నుందువేమోకదా! ఓ న్యాయాధికారీ! ఉండుము, ఒక్క క్షణముండుము నీవు నిజమైన న్యాయాధికారివైనచో ధర్మపరిశీలనము చేయుము! తులసీరావును చంపినద్రోహియెవ్వరో కనుగొని శిక్షింపుము. అన్నపూర్ణ చంపినదనుకొంటివా! ఓ వెఱ్ఱివాఁడా నా అన్నపూర్ణ - పవిత్రురాలగు నా అన్నపూర్ణ మహాపతివ్రతయైన నా అన్నపూర్ణ - తండ్రిని కన్నతండ్రిని - చంపగల హంతకురాలనియే నమ్ముచున్నావా! ఛీ! నీ న్యాయము మండిపోయినది. నీ తెలివి తగులఁబడిపోయినది, ఆపీఠమునకు - ఆ పావనమైన న్యాయపీఠమునకు నీ వనర్హుఁడవు. అర్హుఁడవైనచో చెప్పుము ఎవ్వరుతులసీరావును హత్యచేసినవారు! నీ తెలివి దీనితో తేటతెల్లమగును. హాహ్హాహ్హా హంతకు నన్వేషింప నీకు సాధ్యమగునా! పట్టెది పట్టెది ఈ శంకరరావు - (రొమ్ము బాదుకొని) - యీ శంకరరావు సుమా! మామనుచంపిన హంతకుఁడు మామ నొక్కనినేనా! అసంఖ్యాకులైన రక్షకభటులను హతమార్చిన వాఁడీ శంకరరావే! మీరందఱు తెలివితక్కువ వందలై నిరపరాధిని, భర్తృగౌరవప్రాణసంరక్షణి యగు పతివ్రతా శిరోమణిని బంధించి, హత్యాపరాధమును మోపి, వధ్యశిలపై నెక్కించి వధింపదలఁచినారు. (క్రోధముతో) ఓరోరి దుర్మార్గులారా న్యాయాన్యాయ విమర్శన పరిజ్ఞాన విహీనులారా! నా యర్ధాంగి నంటుటకు మీ తరమగునటరా! "రంగూన్ రౌడి" అను విఖ్యాతినొందిన రాజభట భయంకరుఁడగు శంకరరావు ప్రాణములతో నుండగా నిరపరాధియగు నన్నపూర్ణను

శిక్షింప మీ తరమగునా! మిమ్ము సృష్టించిన బ్రహ్మతరమగునా! ఇంక శంకరరావు ప్రతాపమును చూడుఁడు. మిమ్మందఱను మారణ హోమము చేయనున్నాడు. (వెఱ్ఱివానివలె పరుగెత్తును.)

(తెర వ్రాలును)

### రంగము — 4

స్థలము—న్యాయస్థానము

(ప్రవేశము-జడ్జి, అన్నపూర్ణ రైటరు)

(ఇద్దరున్యాయవాదులు, ఒక పోలీసు)

జడ్జి—అమ్మా! అన్నపూర్ణా! నిన్ను! నే నెన్నఁడును చూడకున్నను, నీపవిత్రచరిత్రమును నే ననేకసారులు వినియుంటిని. ఏమి యింత సాహసమునకు పాల్పడితివి!

అన్న—తండ్రీ! మీరు న్యాయాధికారులు! ఇప్పుడు న్యాయశాస్త్ర ప్రకారముగా నాకర్హమగుశిక్షను దయచేయుఁడు, అంతే కాని యితరవిషయములను నన్ను ప్రశ్నింపకుఁడు.

జడ్జి—మంచిది. నీచరిత్రములను విమర్శించుటకుగాని నీకు హితాహిత బోధలను గావించుటకుఁగాని నాకిది సమయముగాదు. అది నాయధికారధర్మమును గాదు నాతీర్మానమ్మును విన్నవించుచున్నాను. ఆలకింపుము...

"హిందూదేశశిక్షాస్మృతిననుసరించి...గిరికుమారియింట జరిగిన హత్యలను రెంటిని నీవే యొనరించినట్లు స్వయముగ సమ్మతించుచున్నావు. కావున, వేఱు సాక్ష్యములతో నిమిత్తము లేకుండ యిందు మూలముగానీకు ఉరిశిక్షను విధించుచున్నాను."

అన్న—మహాప్రసాదము...

జడ్జి—(పీఠమునుండి లేచును)

(తెర వ్రాలును)

### రంగము — ౯

స్థలము:—వధ్యశిలగల బయలు

ప్రవేశము—వధ్యశిలపై - అన్నపూర్ణ - ప్రక్కన - ఖడ్గస్థుఁడగు కటిక వాడు, పీఠముకడ జైలు సూపరింటెంటు

(గంటమ్రోగును)

జైలు—అమ్మా! అన్నపూర్ణ! ఐదునిమిషములు దైవప్రార్థనము చేసి కొనుటకు నీ కధికారముగలదు. శీఘ్రముగ కానిమ్ము.

అన్న—(కన్నులుమూసి) జగదీశ్వరా!

సీ. జీవితేశునకయి జీవప్రదానము
గావింపగామది గాంక్ష జేసి
విభుఁడొనరించిన విద్రోహములనెల్ల
చలనంబులేక నెౌదల ధరించి
హంతకినని పల్కి యధికారవర్గంబు
నదలించి యురికంబమందు జేర్చి
పావనంబగు భగవద్గీతపైన వి
శ్వాసార్హమైనట్టి ప్రతిన జేసి

గీ. పెనుఁగులాడితి స్వామి! నావిభునికొరకు
అఖిలదోషముల్ మన్నించి యన్నపూర్ణ
భావిజన్మఁబులందున ప్రాణనాథుఁ
గాగ శంకరుఁగూర్చుమో కలుషహారణ!

అయ్యా! నా ప్రార్థనము పూర్తియైనది. ఇంక మీకర్తవ్యమును నడుపుడు.

జైలు—కిరాతుఁడా! నీపని కానిమ్ము;

కిరా—(కత్తినెత్తును)

(శంకరరావు పటాక్షేపమున ప్రవేశము)

శంక—నిలుపుము. కిరాతుఁడా! ఆఖడ్గమును నిలుపుము—అన్నపూర్ణా అన్నపూర్ణా! నీవు నిర్దోషివి. నిన్నీస్థితికిఁ దెచ్చిన పాపాత్ముఁడను నేను. నేనుండగా నీవేల వధింపఁబడవలెను? లెమ్ము చేసినసర్వ విద్రోహములకును ఉరిశిక్ష ననుభవింప నేనువచ్చితిని. నా మనవి

వినుము. పవిత్రురాలగు నీకా పాపదేశము తగినదికాదు. నేను జడ్జిగారికి వ్రాసికొంటిని నీవధను నిలుపుటకై. ఆజ్ఞాపత్రము రాగలదు. రమ్ము - కిందికిరమ్ము.

అన్న—నీపాప మేమో నీవేమో నే నెఱుంగను గిరికుమారియిఁట నేను రెండుహత్యల నొనర్చినహంతకినగుటవలన శిక్షింపబడుచున్నాను. అయ్యా! మీ రేల విభ్రాంతులై యింకను చూచుచున్నారు? మీ రీయున్మత్తునిమాటలను విశ్వసించుచున్నారా! రాజద్రోహ మొనర్చుట మీకు తగదు. నన్ను వధింప నాజ్ఞయిండు.

శంక—అయ్యా! వలదు. వలదు - ఈమె యనృతములాడుచున్నది. పాపాత్ముఁడగు నన్ను రక్షించుటకై అనృతములాడుచున్నది. మహాసాధ్వీ. న్యాయమును పరిపాలింపుము. నేనే హంతకుఁడను, జారుఁడను, చోరుడను. అట్లు న్యాయాధికారుల కెఱుకపఱచి యున్నాను. నన్ను వధింపుడు - సిద్ధముగానున్నాను.

జైలు—శంకరరావ్! ఈ రెండుహత్యలకును యీమె వధింపబడకతప్పదు నీవును హంతకుడవేయైనను, రాజశాసనమైనపిదపఁగాని నిన్ను వధించుటకు వీలులేదు - కిరాతా! నీపని కానిమ్ము.

(కిరాతుఁడు కత్తినెత్తును.)

శంక—(కోపముతో) నిలువుము. కిరాతుఁడా! నిలువుము. ఓయుద్యోగీ! నిజమైనహంతకుని వదలి నిరపరాధులను వధించుటయా నీన్యాయము! ఛీ! ఇట్టి యన్యాయబద్ధమైన శిక్షాస్మృతియేల? తగులఁబెట్టనా? నన్ను వధించుట కధికారము కాపలెనంటివి! మంచిమాటయే. అంతవర కీవధను నిలిపివేయుము. రాజశాసన మిప్పుడే నీకు చేరగలదు. నామాట విశ్వసింపుము న్యాయమును పాలించినవాఁడ వగుదువు.

జైలు—ఈహత్యను నిలుపుటకు నా కధికారము లేదు.

శంక—లేదా? లేదా నీకధికారము? (ఏడ్చును) నా అన్నపూర్ణ-సాధ్వీ శిరోరత్నమగు నాఅన్నపూర్ణ-అపరాధము నెఱుంగని నాయన్న

పూర్ణ అన్యాయముగ అతిఘోరముగ వధింపఁబడుటను పాపాత్ముఁడనగు నేను నాకన్నులతోఁ జూచి భరింపఁగలనా! ఇంక న్యాయమెక్కడ అన్యాయమెక్కడ? న్యాయాన్యాయములను గుర్తింపలేని గడ్డిపందయగు న్యాయాధికారి యెవ్వఁడో వ్రాసినతీర్పు ననుసరించి యెరిఁగియుండియు నీవీ ఘోరకర్మము నాచరింతువా? కన్నులు లేవా నీకు? ద్రోహియెవ్వఁడో, హంతకుఁ డెవ్వఁడో గుఱుతింపలేవా? నిరపరాధులను వధించుటకా ఈన్యాయాధికారులు, ఈ న్యాయపీఠములు యేర్పడినవి? అయ్యయ్యో అన్నపూర్ణా! నాయన్నపూర్ణా: నీకొంతుకోయ సిద్ధమైన యీ పాపిని రక్షించుట కేలబలి యయ్యెదవు? నా భాగ్యలక్ష్మి నన్ను వదలిపోకుము, నీయాయుర్దాయమునుఁ గూడ పోసికొని యీ పాపాత్ముఁడింక బ్రతకలేఁడు. రమ్ము. రమ్ము ఆ పాపప్రదేశము నుండి క్రిందికిరమ్ము: నన్ను చచ్చి శాశ్వతవిశ్రాంతి నంద నిమ్ము ఓ న్యాయాధిపతీ! న్యాయాధిపతీ! చూచెదవేలనయ్యా! ఇదినీకు పాపమయ్యా! సాధ్విని చంపుచుంటివిసుమా! రత్నమును కాల రాయుచుంటివి సుమా! శిరీషపేశల కుసుమమును సన్నకంట నూరనుంటివిసుమా!...—......ఓ పాపాత్ముఁడా! నామాట వినవా! అన్నపూర్ణహత్యనాపవా? ఆపవా! నాకన్న నీవే ఘోరహంతకుఁడ వౌదువు సుమా నామాట విను, విను. ఆపుము; హత్యనాపుము!

శైల—వీలులేదు. కిరాతుఁడా! ఇదే తుదియాజ్ఞ! ఇంక నాలసించుటకు వీలులేదు. కానిమ్ము!

(కిరాతుఁడు అన్నపూర్ణను వధించును.)

శంక—హా అన్నపూర్ణా! (భూమిపైఁబడి నెత్తురుగ్రక్కి మరణించును.)

సంపూర్ణము

# అనుబంధములు



## (1) అన్నపూర్ణ

నా! ప్రియవిభునినడత గనగా, మది వగపుగాన్పింప ॥నా॥
నరాశనునిగతి: సురాపానరతి, దురాత్ములను హితులు జేన
గొాన దిరుగు ॥నా॥
ఇక నేమి సేతు, నెటువలె సైతున్, ఈ దురంతంబగు నడతల
కాపాడగ నే వారలు కాన్పింపరె; నా ప్రాప్తికి ॥నా॥

## (2) డైలాగు

ముఖారి రాగం—ఆదితాళం

అన్న—నాథా నాతోడ నీకిటు, వాదా కులకాంతలకు బాధాకరంబు
గాదా. అఅఅఅఅఅఅ ॥నా॥
మాన్యుండౌ జనకుండు మరణింపంగా, సుంతైన నీమదిచింత
నందనేల: పలుగాకులగు లోకు లిది విన్న నపకీర్తి ॥నా॥

కంక—మూఢమతిని నిరుత్సాహ మొనరించితివే ననున్, నినుకనులను
గనంజాలను. గృహమే నరకంబు ॥ఛీ॥

అన్న—.................. ॥నాథా॥

## (3) రాధాబాయి

కాఫీ—రూపకము

నేను గదా! అప్టూడేట్ (Up-to-date). ఫ్యాషన్ (Fashion)
గలవారినీ ఫ్యాషన్ గలవారినీ! అమకుల మితారినీ ॥నే॥
షోకులో! ఠీకులో! నాకెవరు సమానులూ ॥నే॥
ఫుల్‌మూన్! లైటు (Full moon light) నాదు సదనమూ!
జాస్మైన్! వైటు (Jasmine White) నాదు వదనమూ! నను
గని శ్రీమ ఘనుగా! ఘనులగు సుర్లైననూ ॥నేనుగదా॥

### (4) డైలాగు

కాఫీ రాగము—రూపకము

జయ—అహో రాధా సంపూర్ణసుధామోహిని। నిను విను వినా। సుదతి గనా లోకమునా ॥అ॥

రాధా—నీకవిత్వమే। సుధాకరము ప్రణయభరముగా। మదికి మోదంబౌ నా మనో నాథా!

జయ—నాదు జీవనంబు నీదు। చరణముల కొసంగెదన్। కమలవిమల నయనయుగము గనగ మోద మొదవుగా ॥అ॥

### (5) డైలాగు

సురట—త్రిశ్రగతి

రాధా—నాదు ప్రియునినోనాడకు। నాయనా। నటకుఁడగుటనటుల నలిపె। ప్రియమునా ॥నా॥

జయ—నిజమిదియే। నామదిగల దదియే। ఘుటికుడ। నటకుఁడ! నగుకవి। నిది వినుమా।

రాధా—లీలానటనంబున కీ। వేలా తామసమూనఁగ। ఖేలనమే ఇది నిజమని। బేలవై తులువా!

గంగా—ఇదియే బహుమానము తలంతువా।

జయ—కదలిచనెద వదలుము నన్। క్రూరత నీరీతిబాధింపగ న్యాయమా

గంగా—వెకలీ। యిఁకరాకుము నాసుతతో సరసంబులనాడన్।

రాధా— ॥నాదు॥

### (6) శంకరరావు

భూప్—ఆదితాళము

ప్రాందీసమానమైన। పానీయ మిాయిల గలదే ॥బ్రాంది॥
పానీయ మిాయిల్లగలదే। పానీయ మిాయిలగలదే। ఫోర్సు

(Force) చేరగ । ఫ్యాషను (Fashion) మీరగ । త్రాగి । ముదమే పారగ । షైరు (Shire) గావింతున్ । నీతో । షైరుకావింతున్
వహ్వారే యిపుడౌదవెదు నా యానందం బెన్నగ నగునా మాటలు)
పోరింగ్ సంసోడాయిన్‌దీగ్లాస్ (Pouring some soda in the glass
హావింగ్ సందరఫ్ తూృదీడోస్ (Having some daraff through the dose)
అండ్‌దెన్ డ్రింక్ పెగ్‌బై పెగ్ (And then drink peg by peg)
హా హా హా హా హా హా! బ్రాందీ (Ha Ha Ha Ha Ha Ha)

---

(7) జానకి.

ఖ్యాగ్—ఆదితాళం

వదరకుము పాపాత్ముడా । మాతోడా ।
వెలసితి జూడా । మధువశమున ॥వద।
మాతను సోదరి నవమానించుచు । నే తనయులు నీరీతిఁజరించిరి
పాతకుఁడవు కులనాపకుండవే ॥ పాత్రమగల్గునో బరికింపుము ॥వద॥

---

(8) నాందీబాయి

ఖ్యాగ్—ఏకతాళం

మొగుడు ముండాకొడుకు । మొదలారిచస్తే ।
పొగవేసి కాళికకు । పోతు బలి యిస్తా ॥మొ॥
మొగము కొండాముచ్చు ॥ ముక్కుపొడుమూగచ్చు ।
కనపడ్డనావాళ్ళు భగభగని రెచ్చూ ।
విరగడై పోతేను । కోరికలు హెచ్చు ॥ మొ॥

(9) డైలాగ్.

ఖ్యాగ్—రూపకము

నాందీ—ఓసీ చటకారీ నీమదమణేగింతునే । నాభర్త । మహా మాహాత్మ్యం డౌగదా ॥ఓ॥
దాసీ—ఓసీ పిసినారీ నాపై నధికారములా । నావసన్ జూపింతూ । రోషం బడగింతున్ ।

ఇద్దఱు—ఇక తాళనూ । కనజాలనూ । కుక్కకాటుకూ । చెప్పు
దెబ్బరే ॥కా॥ మందూ ।

గంగా— వెరీ వెల్ । వెరీ వెల్ ॥వెరీ వెల్ (Very well)

నాందీ— ॥ఓసీ॥

---

## (10) రాధాబాయి

భీంపలాస్—ఆదితాళం

ప్రేమసఖా మోహనకారా ॥ప్రే॥
మానినీ మానసానందచోరా ॥ప్రే॥
తావకీనమహిమా । దరణచే ప్రేమా ।
సంప్రీతిన్ । ప్రేమింతు నినున్ । వినోదా ।
ప్రమోదా । కామాబ్ధిదేల్వ రమ్మా ॥ప్రే॥

---

## (11) అన్నపూర్ణ,

హిందుస్థానీముఖారి—ఆదితాళం

హాతవిధియే మాయామో । పతికి నాపై ప్రేమా । తీరెనా
సుఖసంప్రాప్తి చనెనా ॥హా॥
మధుపానమేనాడు।మదిన్ విడదేసతమూఁ అధమ వేశ్యాలోలు।
డయ్యెనా । అయ్యయ్యో । సుఖసంప్రాప్తి చనెనా ॥హా॥

---

## (12) అన్నపూర్ణ,

కాఫీ—ఆదితాళం

కరుణింపుమా । నానాయనా ॥క॥
నీసుతన్ నేగానా ॥క॥
చరణముగడిగియు । శంకరునకు ననుపరిణయ మొనరించి।
మఱచితివే యది ॥క॥

---

(అన్నపూర్ణ)
యమునా కల్యాణీ—ఆది.

ఓ వాసుదేవా! శ్రీనివాసా—ఓ—
దేవాదిదేవా! దివ్యప్రభావా—ఓ—
హంతకుఁడగు నాయాత్మభువిని పై! పంతగింపకుమా! పటుకృప నేలుమా—ఓ.

---

(14) డైలాగు.
కాఫీ—ఝాంప్రా

శంత—అధరమధుర చుంబనం బహో ప్రమోదమూ! సుధామోహా మానసం! బహో వినోదమూ—అ—
ప్రభా—నీసుందరంబూ! ప్రియబంధురంబుగాష్టి! ఆశదీర మోదమార ననుభవించి! భువి సుఖంతుగా—అ—

---

(15) డైలాగు.
బ్యాగ్—ఆదితాళము

మోహా—ఈగతి భయమేటికి మదిగా నెదవు! నా గురుభుజబల మెఱుఁగవుగా—ఈ—
కృష్ణ—ఓరి కుమారక మారువాడియున! నేమని నీమది దలచితివో—
మోహా—వానితల చిదుగగొట్టెద మామా!
కృష్ణ—వలదు వలదు విను విను మామా!
మోహా—ఈగతి—

---

(16) జయరాం, కృష్ణమూర్తి
కేదారం—జప్‌తాల్

పరమప్రియ మొదవుగా! హీంతు లిఖపురము చేగ—ప—
ధరణిగంగారాము! తనయు భ్రమియింపఁగా! గురుతర కపట లీల! గూర్చి మోసము సలుప! శంతరుని ధనమునా! శౌన మంది చెడకుండ—ప—

---

## (17) డైలాగు.

శంక—మదనమోహనకర । వదనసుధాకర । సదయహృదయ గురుతర
వినయా । మదిని గుతుకమున । మదనకదనమున । మరులకొలి
పితిని । గుణసదనా—మ—

ప్రభా—సరసవచనరచనాంబుధి దేలిచి । సరస । నిలువుమో । సుమ
బాణా కరము కరమునను । కలిపి కుతుకమున కరుణ బరపు
మానసచోరా—మ—

---

## (18) అన్నపూర్ణ
ముఖారి—ఆది.

ఓ యనఘా । మనవిని వినుమిక నిటు । పలుకకో ప్రాణేశా—ఓ
వగలాడినిగూడి పయనమయి ।తరలెద వంచును దెలిసెను
మాకో ॥య॥
అధికార భ । యము మీరంగ నరుదెంచితి పీపురికిన్ । పర
నారుల గూడగడలచెదు । హారి హారి యీాపని । గురుతర కలు
షము—అ—

---

## (19) డైలాగు.
బ్యాండు—ఆది.

శంక—పలుకులు చెడచెవి నిడెదవుగా । పలుమరు ననువిడ దలపవుగా।
ముదమేపారగ ! విలసిల్లెడి నగ అపకీర్తి పా । లొన
రించెదుగా ।
అన్న—విడువనింక ధీరగుణా । అలఅల మనగజాలా । మాన ధనా ।
అఅఅ—
శంకర—...పలుకులు—

---

## (20) నాందీబాయి.

అయ్యో అయ్యో । ఈ బాలకునకు । అయ్యే మొవఁడౌకో ।
నెయ్యమున నెవరినైన । నేర్పరింతునా ॥అ॥

---

## (21) శంకరరావు.

బ్యాగ్ — ఆది.

హాయియీ । కలిగించును యీసారాయీ ! రుచిచూడుము
భాయీ ॥హా॥

మదిగల కలఁతల నిమిషములోపల । మరిపింపఁగడగు హుషారి
నొసగుచు । మది బ్రహ్మానందము చేకూర్పఁగ । గలదిగా ॥నిమి
షమా । త్రింబుననె ॥హా॥

---

## (22) శంకరరావు.

(కసియాత్యజింపదాలా అను మట్టును పల్లవిమాత్ర మనుకరించును)

ధనమే ప్రపంచలీలా । ఆహా ॥ధన॥
బలే । దానిమహిమ వర్ణింపజాలా ।ధన॥

(సాకె) ధనహీనుం డవనిలో
మిత్రిం) తృణసమాన మగునే చాలా । తృణసమాన మగునే ॥ధన॥
మాటలు) వడ్డీలకు వడ్డీలు, బాకీలకు డిక్రీలు చేసి । కూడ । బెట్టి నట్టి
సంచులాది । పైకమునకు
(రాగం) ప్రాణమునకు లంకె । అది । పోయిన పెనురంకె ।

మోదగిరీపైసా । ఆనందకరీ పైసా
పైసా । పైసా । పైసా । పైసా । పైసా ।
ఎంతో భ్రాంతిఁ గల్గించుఁ । పైసా । పైసా । పైసా !
దానిమహిమ వర్ణింపఁగఁజాలా ॥ధన॥

---

## (23) శంకరరావు.

బ్యాండ్—జిల్లాడ్

(టీక) హా గుణశీలా । కరుణాహీనుఁడ । నను శపియింప వదేలా ॥హా॥

(త్రితాల్) ధర నీశాంతమె దావానలమై మరణింపకయే । మండించె సఖి ॥హా॥

పాపమతిని మత్రి । బాల్పడజేసిన పాపఫలమె నను । బాధించె సతీ ॥హా॥

సంపూర్ణము



# N. G. O. గుమాస్తా.

## (అద్దెకొంప) గ్రంథకర్త: ఆత్రేయ.

అసలే అద్దెకొంప. అన్నిటికీ ఎద్దడి జీవితం. చీటికీమాటికీ కచేరీగస్తరింపులు స్తుతారీఖున ప్రభుకలాపం పాతఅప్పులు తీరిన దగ్గరనుంచి జానీవిలాసం. అను డుకీ హంసపాదులు సరిగంచు పంచల జంజాటంలేదు సరిగదా సబ్బుముక్క కొనడానికి కూడా పావలాబాకీపడే పతనం. రాజరిక ఉద్యోగంకాని పేద శాధ.

ఇది నేటి గుమాస్తా బ్రతుకు. మేలిజీతగాడుకాలేదు. జీతెక్కట్టుకొని ముష్టి ఎత్తుకోలేడు. కూలిచేసుకోవడానికి మనసొప్పదు. మానవ సంఘంలో అదొక దరిద్ర మూగజీవం పాపం! ఈవేదన పడలేక లంచంపట్టుతారు. పట్టుకొంటారు ప్రభువులు. ఉద్యోగం తీసేయుగలరు కాని చాలీచాలని అనంతమైన ఆదుర్భర కాద బీభత్స భయానక కుటుంబపోషణానికి సరిపడేజీతం ఇద్దామనితోచదా వారలకు! ప్రతి దృశ్యం రాళ్ళనైనా కరగించునంత రసాత్మకం ప్రతి సంఘు గా నిత్యమైనందిన జీవితచర్యలో ఒక ప్రతిబింబం. ఒక్కొక్క మాట యుద్ధ నుం హృదయాలకు ఒక్కొక్క శూలం. ఒక్కొక్క రంగం సామాజికుల స్సులకు ఒక్కొక్క గాలం.

## బీ ప ప ద్వా ర బి, ఏ.

### సాంఘిక నాటకము

### రచన: మారిశెట్టి సత్యనారాయణకవి.

బీద విద్యార్థులు విద్యాభివృద్ధికై పడుపాట్లు, రాజారావు బీదవిద్యార్థి వృత్త నాశ్రయించి, పాత్రములు, వస్త్రములను సముపార్జించి మ్యునిసిపాలిటీ దీపములకడ నిలచి చదివి తుదకు, బి, ఏ. ప్యాసై తన విజ్ఞానపటిమచే వకీలు నాక్రైన వివాహమాడి జిల్లామున్సబు పదవి నందగలుగును ధనికుల పుత్రు మాధవరావు మున్నగువారు విద్యయందనాదరము వహించుట విద్యావిహీను లు, విద్యావంతులైన శకుంతల, శ్యామల, సచ్ఛీలవర్తన మిక్కిలి పొందుపరి చినది. ఈ నాటకము. కాకినాడ, తుని, యెలమంచిలి, అనకాపల్లి, విశాఖ పట్నము, కనగపూడి, టాటా మున్నగు పట్టణములలో ప్రదర్శింపబడి, సర్వ త్రా ప్రశంసింపబడినది.

